# చిత్రవాణి

ఖండకావ్యము

ప్రథమ భాగము



గ్రంథకర్త:

పెన్మెత్స రాజంరాజు.

చోడవరము.

1950



మూల్యము రూ. 1—4—0

# ప్రస్తావన

ఈ గ్రంథమును రచియించినవారు ఆంధ్రక్షత్రియ వంశ సంభూతులు పెన్మెత్స వేంకట నరశింహరాజుగారి కుమారులు రాజంరాజుగారు. వీరి నివాసము తాడేపల్లిగూడెం తాలూకా లోగల చోడవర గ్రామము. వీరు పిన్నవయస్సున ఎలిమెంటరీ పాఠశాలలో కొలది శిక్షణపొంది తదుపరి వ్యవసాయమునఁ గృషిచేయుచు యీ గ్రంథమును రచియింప గలిగిరి. పూర్వ వాసనా బలమున వీరికీ కవిత్వ ధోరణి యబ్బినది. వీరెన్న డును నెట్టి గురు శుశ్రూషయు నొనర్చి యుండలేదు. కేవ లము సరస్వతీ కటాక్షమే! వీరి మృదు మధుర కవితా ధోరణికి బీజము!

ప్రశాంత వర్తనము, పెద్దల యెడ వినయగరిమము మున్నగు సద్గుణములు వీరికిఁ జిన్ననాటఁ దమ విద్యాభ్యాస కాలమున తణుకు సమీపమందున్న వడ్లూరు గ్రామమున మాతామహ గేహమున నున్నప్పుడే అశిక్షితముగా నల వడినవి.

కొలది కాలము క్రిందనే వీరికిని నాకును దొట్టదొలి పరిచయము ఏలూరున మా మిత్రులు కాలేజీ పండితులునగు శ్రీయుత గరికపాటి మల్లావధానిగారి యింటఁ గలిగినది.

వీరు నిరంతరము వ్యవసాయ కృషియందే నిమగ్నులై విశ్రాంతి లభించినప్పుడెల్ల ఖండ ఖండములుగాఁ గవిత్వమును వ్రాయుచువచ్చి తుదకు "చిత్రవాణి" యను పేరుతో నేటికీ ఖండకావ్యమునుఁ బ్రచురింప గలిగిరి.

వీరికిది ప్రారంభదశయే యైనను యిందు గల కవిత్వము ప్రసన్నతాగుణము గలిగి హృద్యమై! శ్రోతలకు సంశ్రవణాసక్తి గలిగించు చున్నది. వివిధ విషయములను గూర్చి వీరు చర్చించి యుండుటయు బ్రశంస నీయమైయున్నది. యీగ్రంథమునుఁ జక్కఁగఁ బరిశీలించినచో పై విషయములు పాఠకులకు విశదములు కాక మానవు.

• ఇందలి మాధుర్య గుణములు తెలుపుటకు యీగ్రంథమే! సాక్షియైయుండ నేను మఱల "యిట్టిది" అని వాకొనుట కేవలము అనవసరము.

అక్షరాస్యుల తోడ నెట్టి సాంగత్యమును కలిగించు కొనుటకు వీలుగాని మారుమూల ప్రదేశమందు నివసించుచు యెట్టి గురుసేవలు లేక యిట్టి మధురమైన కబ్బము చెప్పనేర్చి నందులకు వీరు మిక్కిలి ప్రశంసా పాత్రులు. అసూయాదూరులైన పండితుల కీవిషయము వేఱ వివరింపఁ బనిలేదు.

ఈ యువక కవీంద్రుఁడు ముందు ముందు యింకనూ మనోజ్ఞములైన గ్రంథములను రచియించి లోక విఖ్యాతిఁ

బడయ గలుగునని నాసంపూర్ణ విశ్వాసము. పరాత్పరుఁడీ విషయమున నీ కవికి దోడ్పడి చిరాయు రుత్సాహములు ప్రసాదించుగాక.

పాందువ్వ గ్రామాధికారులు క్షత్రియకుల భూషణులు సముదార చరిత్రులు నగు శ్రీయుత వేగేశన కనకదుర్గ వేంకట సత్యనారాయణ రాజుగారీ గ్రంథమును అంకితమును బొంది యుండిరి. ఇట్టి యువక కవులకు ప్రోత్సాహము నొసంగి మహోన్నత స్థితికి తెచ్చుటకు బూనుకొన్న శ్రీయుత కనక రాజుగారు పండిత కవి వరేణ్యాది రసజ్ఞ శిఖామణులకు శ్లాఘాపాత్రులగు చున్నారు. వీరికిఁగూడ పరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యైశ్వర్యము లిచ్చి కాపాడుగాక.

ఇట్లు,

కవిరత్న, అవధాని పంచానన,

కాకర్ల కొండలరావు.

"శతావధాని"

తాడేపల్లిగూడెం.
ది 3-11-1949

# విషయసూచిక.



# అంకితము.

శ్రీసతి! సర్వదా ప్రమద
చిత్తముతో చరణంబులొత్త, నా
భీనరసీరుహంబున, న
వేలముగానినదింప, భృంగముల్
వాసవనారదాది సుర
వర్యులుతన్ వినుతింపనొప్పు, నా
భాసురమూర్తి! నాదుకృతి
భర్తకొసంగుత, భాగ్యకీర్తులన్.

నవరస నవ్యభావములు
నల్దిశలన్ వెనజిమ్ముమేటి స
త్కవుల కలాలలో మెలగి,
ధన్యత గాంచినపుణ్యమూర్తి, ని
న్నవిరళ! భోగభాగ్యముల
హాయిగ! దన్పుచునుండనింక, నో
కవనకుమారికా! భువి న
ఖండయశంబు గడింపు బేర్మితో!

మేదురకీర్తి! భాసురుడ
మేయగుణుండు, విధేయవర్తనా
హ్లాదకరుండు, స్తోత్రవచ
నావళికిన్ విముఖుండు నిత్యసత్యసం

వాఁడియు, శౌర్యశూరుఁడు, సు
వంశసముద్భవు డేరు వేడినన్
గాదనుమాట లేని, కన
కక్షితిపాలుని సాటియే యొరుల్. 3

సవతులు గలరని-లవమును.
నవయక ప్రాణేశుమనమునన్ నిత్యము దం
బివురొత్తగ సేవింపుచుఁ
బ్రవిమల విఖ్యాతిరమను బడయుము తనయా! 4

ఇది మత్కృతి కన్యామణి
చెదరని చిత్తమున నేఁడు చేరివరించెన్
హృదయంబిచ్చి గ్రహింపుమ
మదిమెచ్చులు గొంచు, కనక మహీవరయింకిన్. 5



## కృ తి ప తి ప్ర శం స.

శ్రీలకావాసమును బుధాశ్రితము నగుచు
క్ష్మాతలింబొల్చు పాందువ్వ గ్రామ మొకటి
అందు వాశిష్ఠగోత్రాబ్ధియందు బొడమి
ఘనత కెక్కెను మహిత వేంకటనృపుండు.

కలిత! వేగేశన క్షత్రియాన్వయాబ్ధి!
    బొంగించి యలరిన, పూర్ణవిధుడు!
పరిపంథియూధంబు, వెరగంద గంభీర
    వర్తనన్ మెలగినభద్రమూర్తి!
దీనరక్షణకునై తెగియెంతధనమైన
    వెచ్చింపజంకని, పృధులదాత!
కష్టించు కృషికసంఘక్లేశమును గాంచి
    కరుణను వర్షించు కల్పతరువు
సమ్ముఖమునసెట్టి, చతురుడై నను నోరు
కదుప వెరపుగొను, నఖండవక్త
సాటిరాజులెల్ల సాటుపికి నుతింప
మనియె వేంకటాఖ్య మహివిభుండు.

భావజ సముడగు నవ్విభు
దేవేరులు-మువ్వురమిత తేజముగల రా
జీవదళ నేత్రలెప్పుడు
సేవింపగ, మనియె నతడు చెదరని సిరులన్.

ఆద్య సుదతి సుబ్బమాంబయు మూడవ
యతివ దనరు రాజమాంబ యనగ
వారిమధ్య వెలసె వనజాక్షి "శ్రీలక్ష్మి
నరసమాంబ" బుధజనాళి! వొగడ.

ఆభవ్యచరిత! కీర్త్యారామమున కెంపు
నిగ్గు చల్లు గులాబి! మొగ్గయనగ
ఆధన్యురాలి! నిత్యామోద జలధిలో
శోభిల్లుచున్న కౌస్తుభ! మనంగ
ఆతల్లి ప్రాజ్ఞని నార్జించుకొని నిల్వ
పోసిన తపనీయ రాసి యనగ
ఆకంజదళనేత్ర! యనుపమ వాత్సల్య
సురవీధి వెలుగొందు మెఱపనంగ
శిధిలమెరుగని మన తెన్ను క్షేత్రమందు
కాలజలదంబు తన యశశ్రీలు! గురియ
ఘనత కెక్కెను వేంకట కనకదుర్గ
సత్యనారాయణాఖ్య సుక్షాత్రవరుడు!

తర్పివ్వించె! పాంథు లుత్తమతోయమును గోరిల
కాసారములు! పెక్కు భాసురముగ
కట్టించె తనయూర కన్నీరువిడు జీర్ణ
దేవాలయము భక్తి తేట పడగ
ఆర్జించె వెలపోసి దార్జన్య రహితుడై
కలిగొట్ల యస్సేటఖండసిరుల

ఇచ్చెను పదివేల నీవి వెల్లడికాగ
　　　　ప్రాజితంబైన కాలేజి కొఱకు
కళలఁ గులికించి సుకవుల గౌరవించి
పోషణము చేసె మృదుతర భాషణముల
దీనజన బాంధవుండనఁ దేజరిల్లి!
ఘనతకెక్కెను వేంకట కనకరాజు.

వాసిగాంచిన తెన్గు భాషామనీషుల!
　　　　కవితాబ్ధిలో! జల కంబులాడి
కమనీయమై స్రోళ్ళు కరగించు గాయక
　　　　కంఠమాధుర్య! శుల్కమును బొంది
అతిమనోహరములై యలరారు సద్భావ!
　　　　వికశిత పుష్పమాలికలు! దాల్చి
సూరి బృందారకస్తూయ మానంబైన
　　　　లాలిత్యమయ- దుకూలము ధరించి
విడువ కనిశంబు మీరమ్య! వేశ్మ! మందు
గ్రాలుచుండిన సద్యశ! శ్రీలలామ!
నిష్కళంకమ్ముగా ధాత్రి నెగడు గాక
భవ్య గుణసాంద్ర! కనక భూపాలచంద్ర!

---

పా మ ర డ.

ఏ విధమైన శాస్త్రము- లో
కింతఁ బఠింపని కర్షకుండ, ధా
త్రీవలయమ్ము నందు నిజ
తేజమునించిన కృష్ణరాయలే
దేవుని సత్కృపన్ తెనుగు
దేశమనంత యశోబ్ధి! దేల్చె, నా
శ్రీవిభు! సత్ప్రసాదమునఁ
జెప్పగ నేర్చితి కబ్బమిమ్మెయిన్.

వాసినిగన్న గొప్ప కవి
వర్యుల జేరక, యే స్వయం కృషిం
జేసి, కవిత్వ వారనిధి!
జేరెడి కబ్బపుటేళ్ళ నీదు నా
యాసము లెక్క- జేయుక శ్రీ
తావన తత్పరమై యెసంగు వా
ణీ సతి, పాద పద్మముల
నేను స్పృశింప దలంచితిన్ మదిన్.

శ్రీ రమణీ! నివాస మయి
చెన్నెసలారెడి రత్నగర్భమై
నీరజజన్మ రాణి! కృప
నెంతొగడించిన ధీవిశాలమై

శూరుల కాటపట్టనగ
శోభిలు! నాశ్రిత కల్పవల్లి! మా
భారత! మాతగొల్తు, నతి
భక్తిసతంబు కృతజ్ఞ బుద్ధినె!

---

## చిత్రవాణి

### ఆంధ్రమాత.

ఏ సాధ్వి! "నన్నయ" హృత్సరోజమునుండి
　　　పసనించె గౌతమీ! యిసుకమీద
ఏతల్లి! దీనయై "పోతనార్యుని" యింట
　　　కన్నీరు విడచె దుఃఖంబు మీర
ఏనాతి! సత్కృపన్ "శ్రీనాథుడానాఁడు"
　　　కంచు ఢక్కలగుండె చించ గలిగె
ఏముద్దరాలు! మాసీమలో "పెద్దన"
　　　కలమున నవసుధన్ జిలికి మెఱసె
ఏ మహావాణి! బిడ్డల కేబదారు
అక్షరంబుల శోభతో! శిక్ష గఱపు
నట్టి! త్రైలోక్య పూజ్య! ఓ "ఆంధ్రమాత"!
గొనుమ నీకిదె నాదు వందన శతంబు!

వేఁగిరాజుల యశోవీధులన్ తొలుదొల్త
　　　తొలకరించిన నూత్న జలజగంధి!
వీరభద్రారెడ్డి విద్వత్సభాస్థలుల్
　　　పరిమదాబ్ధి ముంచిన విమల చరిత!

కృష్ణరాయని లసద్దేహాంతరంబుల
స్వేచ్ఛమై బెరిగిన మృగవిలోక!
మనుమసిద్ధి నృపాలు వననికుంజములందు
మురిసిన యందాల మెఱపుం దీవ!
నాల్గుకోటుల బిడ్డ లనారతంబు
గొలుచు చుండగ లేశము న్వొలితిలేక
ఆపదలు బాపిబ్రోచు ఓ "ఆంధ్రమాత"
గొనుము నీకిదె నాదు వందనశతంబు.

---

## భ ర త మా త.

సచ్చరిత్రనుమించు సగరమన్వాదులౌ
నృపవరేణ్యులగన్న నెలతమిన్న!
సత్యసంధుండు నాదిత్యవంశ్యుండైన
త్రైశంఖుగాంచిన తలిరుబోండి!
రఘురాముఘనపాద రాజీవ భూరజో
పుంజంబుసోకిన, పూజ్యురాలు!
వ్యాసాదిసన్మునివరుల పూజాబ్ధిలో
మునిగి తేలిన మేటి యనఘచరిత!
చెలగి! భాగీరథీ! సింధు! సలిలమందు
జలకమాడుచు ముదమందు లలిత దేహా!

# భారతమాత

భారతీయుల నట్టింట పారిజాత!
తరువునై యొప్పుచుండు మా "భరతమాత".

శతకోటివవావుడైన ధృతిడయ్యొ పోరాడు
కలికువీరులగన్న సరసిజాక్షి!
సారెసారెకు సుధాధారలుగురియించు
కవికుమారులగన్న భవవిదూర!
మాతృభూమికి మై సమర్పింపవెలువని.
వీరకాంతలఁగన్న వెలదిమిన్న!
మునిగిన దేవత్వము నొసంగజాలిన
తీర్థాలవెలిగెడి ధీవిశాల
కోట్లకొలదిగ బిడ్డలు కుక్షినిముడ
లోకమాతలకెంతయో లోటుఁజూపి
ప్రమదవారాశి ఊర్ముల్పై నటించు
ప్రథిత సౌభాగ్యదేవి మా భరతమాత!

స్థిరముగా, నీదుపెందురుముపై కుముదపు
మాలగానమర హిమాలయాద్రి!
బాలచంద్రుని! నోటువలుచు నీఫాలాన
తిలకంబుగా ఝిల్లి తేజరిల్ల
తనువైన నీమధ్యతలమందు వజ్రాల
కమరుగా నమర న గ్గాతమియును
అరయు పల్లవకాంతి నవహసించెడి పాద
పంకజ వీధినై లంకయమర

మహితకాంచన రత్నసంపదలు మెఱయ
ఖనిజమయ లక్ష్మినై! విపులశోభను ఘటింప
నిరతసౌభాగ్యదేవినై! వరలునీకు
ప్రణుతిగావింతు సర్వదా! భరతమాత!

---

తుమ్మెద.

చంటితనంబున నీవా
తుంటరి ముక్కంటి వైరిలో! చెలిమిని, ని
ట్లుంటివి లేకుండిన, నీ
కంటెను, గాయకుడు జగతిఁగలడే భృంగా?

సరిగమాదులైన సప్తస్వరమ్ములు
చెప్పుకొంటివెచట చిన్ననాఁడు
నిపుణమతులు మెచ్చు నీ రాగజలధిలో
తనువు పులకరించె వనవిహారి.

సగముగవిచ్చు నవ్యసుమ
సారముఁగ్రోలి! ప్రహృష్ట చిత్తవై
వగపను మాటలేక మధుపా!
మునుపెచ్చటఁ జెప్పుకొంటి వీ
జిగిబిగి! ముద్దుపాటలు, ర
చించిన సత్కవులెవ్వరోకదా!

# తుమ్మెద

నగవులుకాదు నాపలుకు
నమ్ముము స్వాగతమంది పొమ్మెదే!

గాలికిఁ దూగుచు న్నిగుల
కంటికి విందొనరించు, పూవు మా
లాలికి కాన్పువేళ తగు
లాలనఁ జేసెడి మంత్రసాన్నివై!

జాలివహించి వచ్చితివె?
చాలును నీదయ పల్కనేల, యీ
మేలున కిల్లు దోచుటలు
మెప్పగునే తలపోయ భృంగమా!

మునుపొకనాఁడు గోపికలు
మోహముచే! నల కృష్ణదేవు! పై
కినుకవహించి యుద్ధవుని
క్రేవను గృమ్మరుచున్న నీ చరి
త్రను, గడుదూరు వ్యాజమున
దద్దయు డెందముదాక బల్కు చో
ప్పును, వినఁగౌతుకంబు మది
బొంగదొడంగె నిదేమి! భృంగమా!

ఆమొగలాయితాజి! నడ
యాడెడి జాజి గులాబితోటలో!
యామున! వీచికావళుల
యందను ఘుం ఘుమ రావముల్ లయ

ల్గా, మధురంపు గానరస
కాండను నేర్చితివేమొ, నేఁడు మా
భూములు చూడవచ్చితివె
పోఁ దరమే యిక నీకు భృంగమా ?

కాంచనమాల రామతిల
కమ్మనుగాన కళాప్రవీణలే
నంచు వచింతురందలి య
దార్థముఁజూచి యెఱింగితిన్ నిజ
మ్మెంచఁ దదీయ గాత్రము లో
కించుక యౌవన మేగినంతనే
దించుకపోవు నిట్టివగ దే ?
మధుపంబ! మనుష్య గానముల్.

నమ్మకు నెచ్చలీ ! కపట
నాటకముల్ విరచించు ధారుణిన్
బమ్మరమె మోసపోవును, కృ
పారసమన్నది కానరాద, దే
తమ్ములు నేఁడు నీకిట వెతల్
ఘటియింప ముదుంగఁజొచ్చె, నో
తుమ్మెద? ప్రొద్దు గృంకెడిని
దూరకుమందుఁ బ్రమాదమయ్యెడున్.

క్రమమున నీవు మాధవుని!
గానముఁజేయుచు శేషశయ్యపై

## చందమామ

రమణినిఁగూడి కేళిమెయి
రాజిలు నాతని బొడ్డుతమ్మిలో
ఘుమఘుమలాడు! తేనెలనుఁ
గ్రోలెదె? నీకిదె వందనంబు, ఓ
సుమరసభోజి? నాకు మధు
సూదనుఁ జేరెడి త్రోవఁజూపవా!

---

## చందమామ.

మున్నీరుతనచెక్క ముద్దాడ, మబ్బులో
వద్దువద్దనిడాగు ముద్దుబాల!
ఇలకు వచ్చిననాఁడె తలయెక్కి శంభున
కామోద మొనగూర్చు నట్టిబుడుత!
గగనవీధినిదాటి కనుఱెప్ప పాటులో
పడమటిగిరిడాగు దుడుకుశిశువు!
జననమొందిన దాది చక్రవాకపు జంట!
విడగొట్టునొక వింతవేటగాడు
కానరాడు మొన్నగగన కామినియింట
నిన్న నేఁడో చేరె కన్నగాడు
వీని తిందురెపుడొ వేలుపు లెఱుగందు
క్షయదినాలమాట చందమామ!

విద్యనేర్పిన గురువెలది! నెత్తుకపోయి
 అపవాదు చెందియు నలరుఘనుడు!
నిజము వక్కాణించి నెరి విధుంతుదుతోడ
 వైరంబుగొన భయంపడనిమేటి!
జారిణీ! జనితాత్మజన్ము! నన్వయకర్త
 గాఁ జేయవెఱువని గట్టిజోదు
యిరువదార్గురు భార్యలేద్వ రోహిణిగూడి
 శాపంబు సైచిన చతురబుద్ధి!
విరహిజనములఁ బీడించు కలికివాడు
జారచోరుల వెరపించు సాహసికుడు
సరసిజమ్ముల ముడిగించి మురియు మేటి
నిందకోర్చెడు బలుదంట చందమామ!

---

## క వి.

అంతు తెలియని యీసృష్టియందు నిలచి
కాలపురుషుడు విసరు బొంగరముమీద
సాముసెరపెడి గంభీర చతురమతివి
తవమెరుంగ వాకప్పుడో కవివరేణ్య!

ఆలమునందు, ప్రాణధన
 మర్పణఁజేసి, స్వదేశమాత! కై

కూలిన వీర సోదరుల
కుక్షిని శాంతిరమన్ ఘటింపగా
జాలిన, తావకీన విల
సద్రచనాభర మాధురీస్రవం
తీ, లహరీ! పరంపరల
దేలగ నేరుతురెట్లు ? సోమరుల్.

లలితంపు రసశబ్ద జలరాశి పొంగార
రాజిల్లు! నాద్విజరాజు! నీవు
సకలశాసన శాస్త్ర సముదయంబు లిఖించి
మహిని శాసించు సామ్రాట్టు! నీవు
రమణీయ కావ్యకుంజముల గ్రుమ్మరుచు గీ
తముఁ బాడిరంజించు భ్రమర! మీావు
కమనీయలసదలంకారామ్ర శాఖపై
రుత మొనర్చెడి పరభృతము నీవు
కలికి నుడి కారమును దెల్పు చిలుక నీవు
త్యాగివై ప్రకృతినిగొల్చు యోగి నీవు
చావెఱుంగని సత్కావ్య జగతికెల్ల
పుడమిఱేడవు కవివరా ! పుణ్యతనుడ !

కీకస సంతాన కీలాల వాహినీ
సంగతాభీలాజి ! రంగమైన
తరులైన! గిరులైన! సరిదుత్కరములైన
ప్రకట బాడబ శిఖిజ్వాలలైన

అతిభయంకరములౌ నశనిపాతమ్ములైన
కంపప్రదక్షోణికంపమ్మైన
స్ఫురితమదాంచిత ద్విరదమండలమ్మైన
భయదకంఠీరవ ప్రకరమ్మైన
నీ నిరంకుశ మృదులేఖినీ వరమ్ము
లెక్కడక జొచ్చి యారసి నిక్కవమును
బట్టి వెదజల్లు నీయశః పరిమళముల
సాటియున్నదె? నీదు వాగ్ధాటికెందు!

భూరి! భారతవర్ష! సారస్వతంబులో
శ్రీకారమేనాడు చెక్కినావొ!
ప్రిభువరార్పితములౌ, రత్నాలరాశితో
దొలి నెంతగా తులందూఁగినావొ!
మండుటెండకు మాడి మహి దున్ను కర్షజీ
వులపాట్ల నెంతగా దెలిపినావొ!
భారతస్వాతంత్ర్య భద్రలబ్ధికి మ్రగ్గి
జాతీయకథ నెంత చాటినావొ!
పద్మసంభవు నిల్లాలి! భవ్యకృపకు
భాజనమ్వైవె యసామాన్య భంగి మెఱయ
నేర్చితివి యెవ్వరెన్నంగ నేర్తురయ్యొ
యనుపమంబైన నీ దివ్య ప్రాజ్ఞమహస్సు!

---

# స్వప్నము.

వదనము వాడె తమ్మికదె
వచ్చె వికాసము కైరవాళికిన్
చెదరిన వక్త్రశోభ మెయిఁ
జేడ్పడు ప్రాక్కకు భాంగనామణీ!
హృదయము పల్లవించె, దివి
నెంతయు ముట్టిన చీకటిం గరం
బదలిచి, నెట్టె రాజు! ధవ
ళాంశుల నంబరవీధి జల్లుచున్.

భోజనముచేసి వెన్నెల రోజు రేయి
కలువలంజీరు పిల్లగాలులకు నులికి
తనువు పులకింప హాయిగా వినుచునుంటి
తమ్ముడెరిగించు ప్రేమ చూతమ్ము కథను.

కాలజీమూత! సంఘాతడోలులఁ బండి
ప్రాగ్గాధలన్ బ్రేమ పలుకుకొనుచు
శశిమండలమున జ్యోత్స్నా పానమొనరించు
లేడితో ముచ్చట లాడుకొనుచు
కలమయూర మరాళముల నొప్పు నీహార
శైలసీమ, పచారు సలుపుకొనుచు

మిన్నేటి మువ్వంపు తిన్నెలందు వియచ్చ
రాంగనాస్నేహంబు లందుకొనుచు
పరగ చుక్కలచెండ్లతో బంతులాడి
కడకుఁ జచ్చి సురత్వంబుగనిన మిథున
చరితమాలింప జెప్పలు బరువుదోచె
నిద్దురమ్మకు నేనన్న ముద్దునుండి!

ఏమనిచెప్పనేర్తు మహి
నెంతయు నొక్కట ముంగజాలు బల్
భూముకు నిద్రనన్నలమ
పార్శ్వక మూల్గకయల్లె నన్ను నే
నే మరువంగ గాంచి నిదు
రింపుచు గుట్టిడుచున్న యంత నా
సోమరిపోతు డెందమునఁ
జూడబడెన్ గలమో! యదార్థమో!

పాటలకాంతులీను ముఖ
పద్మము, పూర్ణశశాంకు తేజమున్
గీటడగించు లేనగవు
కేరుచు ద్రిమ్మరు తేంట్ల కెంతయు
నోటమిగూర్చు వేణియును
నొప్పెడి సారసనేత్ర! యెవ్వరో!
సీటుగవచ్చి కట్టెదుట
నిల్చెను భూరి కృపానముద్రయై.

నిలువుటద్దమ్ము చెక్కుతోఁ జెలిమిచేయ
కర్ణకుండలరుచి చుట్టు గ్రమ్ముకొనగ
ప్రాకటంపు త్రివర్ణపతాక మెగుర
చేత ధరియించి తోఁచెనా చిగురుఁబోఁడి. 6

సరగునలేచి యామె పద
సారసముల్ తలసోఁక మ్రొక్కి నన్
గరములు చాచి యెత్తి కొడు
కా! యని యవ్వనజాక్షి! బల్కె భా
సురమగు ప్రేమవారినిధి
జొచ్చి సుఖించు ప్రశాంతజీవులన్
సొరిదికలంచి మాపు వర
శుల్కములారసి యింక నిద్రయే! 7

పెద్దపిశాచి యద్ది విను
పెండిలిశబ్దపు వాస్తవార్థమున్
బ్రద్దలుచేసి గేస్తులకుఁ
బాటిలజేయు ననేక బాధలన్
నిద్దురవేళయే తనయ
నేను సమస్త వసుంధరాస్థలిన్
బెద్దను 'భారతాంబ' యని
పిల్తురు కోట్లకొలంది మానవుల్. 8

మానవకన్యల నేచగ
వ్రానిన యీశుల్కవిధిని బారిగొనలేకే

జ్ఞానులగుకవులు ప్రాజ్ఞులు
దానికి వశ్యులైరి మనెడి దారియుకలదే ?

గ్రహసంతతి మానవులకుఁ
దహతహనిడ, మంత్రకలనఁ దరుముదు రిల నా
గ్రహములను మించు దశమ
గ్రహమియ్యది సోక తేలగలడే బిడ్డా!

పూవుఁబోఁడులఁగన్నట్టి పుణ్యమతుల
పాడువరశుల్కల భూతంబు పట్టువరుప
చిక్కియిక్కట్ల పాలయి చేవదక్కి
అధికశోకాగ్ని కాహుతియైదపింత్రు.

చెదరి యెన్నో రత్నసింహాసనంబులు
పాశ్చాత్యసీమల బాటపట్టె
కొల్లగొట్టిన పెక్కు గోపురవ్రజముల్
గజనీపురంబులో కన్నుమూసె
సారసుధనుజిల్కు సారస్వతంబెల్ల
క్రిముల దంతాలలో నమసిపోయె
వెలలేని నాయింటికళలెన్నొ యూరపు
దొరల యుపేక్షలో కరగియడగె
సురుచిరంబైన మనదేశశోభకెల్ల
మూలమైనట్టి కన్యకా జాలములను
ఘోర వరశుల్కదానవి గొంతుకొరుక
శ్రీవిభూతులుమించి వర్ధిల్లగలవె.

ఆపె యీరీతిబల్కు వాచామృతమున
కానగారాని ఒకచిన్ని ఫేనమాచు
నేను స్వాగత మాపె కర్పింపనెంచి
కలముగైకొంటి నంతె యాకస్మికముగ 13

పకపకనవ్వి యావికచ
పంకజనేత్ర మెఱుంగువోలె, నా
కిక గనుపింప మిన్ననట
హృత్తలమం దెసలార ఖిన్నతన్
గనుగవవిచ్చి కట్టెదుటఁ
గంటి మహావిలవీధియందు, గ్రఁ
న్నన బరువెత్తు నమ్మెయిలు కాండము
లం గడుచోద్య మొప్పగన్. 14

---

తెలుఁగు రాజులు.

విపులబాహాబలుల్వేఁగి రాజేంద్రులీ!
విపులాతలంబందు, వెలయునాఁడు
ఢిల్లీమహమ్మదు నల్లాడజేసిన
అల ప్రతాపుడు దేశమరయునాఁడు
అసమానశూరుడై యలరారు మాకృష్ణ
రాయలు రాజ్యంబు చేయునాఁడు

పల్లవులే మహాబలిపురంబున శిల్ప
కళకు జీవమువోయఁ గన్నవాఁడు
భారతావని దక్షిణాపథమునందు
నర్మదా! గౌతమీ! ముఖ్యనదులమధ్య
ననిమిషత్వంబుగని వెలింగిన, తెనుంగు
నృపవరేణ్యుల! విభవంబు! లెరుగరావె?
శ్రీకాకుళమ్ములో లోకరక్షకుడైన
ఆంధ్రదేవు మహాత్వ మాత్మదలవ
పలనాటిశిలలలో విలయమందె వెలుంగు
బాలచంద్రుని చేతిబాకు నరయ
అమరావతీక్షేత్రి మందొప్పు పాషాణ
శిల్పనైపుణ్యంపు శ్రీగనంగ
ప్రతినగైకొని వైరివక్షంబు చెండిన
వెలమ బెబ్బులి యశఃకలనమెన్న
కొండవీటిని నలరు నుద్దండులైన
రెడ్డిరాజుల శూరత లెడదఁదలుప
ననిమిషత్వమ్ముగని వెలింగిన తెనుంగు
నృపవరేణ్యుల విభవంబు లెరుగరావె.
తపనీయగర్భునే! తల్లడింపగజేయు
పండితాస్యమునుండి బరగినట్టి
పలుదెరంగుల గద్యపద్య కావ్యములందు
నమృతంబు చిలికించి యలరునట్టి

నాల్గురీతులఁ బెఱింగి, నవరసంబులఁ గుప్ప
కవిపుంగవులఁ గాంచఁ గలిగినట్టి
పృథుబలోపేతులౌ పృథ్వీపతులచేత
సమితాదరంబుల నందినట్టి
ఆమ్రపల్లవ మృదులమ్ము లైనయట్టి
అక్షయమ్ములు స్తుత్యమ్ము లైనయట్టి
ఆంధ్రవాఙ్మయ సత్కృతు లరసిచూడ
తెనుఁగురాజుల సత్కీర్తి తేటపడదె. 3

---

## నే తా జీ.

తెగువను భారత! భామిని
వగఁదీర్పఁగ నాంగ్లవీరవక్షమ్ములలో
తెగఁ బ్రేల్ ఫిరంగివగు ఓ
జగజట్టీ! బోసువీర! స్వాగతమయ్యా! 1

గృహారాజ్యస్తమయంబు నందని, మహా
రాజ్యంబె యల్లాడ, నీ
సహజంబైన యుదారశక్తి దెలియ
జైహిందు శావంబదే
అహహా! నింగికి నేలకంటెను కతో
రాంగ్లేయ యూథాల, ని

స్ఫృహలుంగా నొసరించి ప్రమాన్నరచేఁ గా
దే! యద్ది బోసుప్రభూ!
సాహంకారత నాంగ్ల గాత్రుసులపై
నస్త్రాగ్ని వర్షించి, త
ద్వ్యాహంబు ల్నిరుమాడి నెమ్మనము నం
దుత్సాహముప్పొంగ, దా
సోహంబుల్ గొనుసట్టి శౌర్యనిధివా
శూరుండవో ధీర! సం
దేహంబేల! సుభాషు నిల్పుము భవ
ద్విఖ్యాతి సుస్థాయిగన్.

కయ్యములోని శూరతను
గాంచి వరించి దివంబునందు, నే
త్రోయ్యలి, తావకీనమగు
దుర్లభ సంగతి నందగాంచి య
త్యయ్య సుఖైక సంపదల
క్రందనమించి గడున్ గృతార్థగా
నయ్యెనొ, యెప్సరస్సరసి
జాక్షుల యం దసమాన భాగ్యమై.

ఏవేళ నీముద్దు మోవియంచునుండి
జారెనో "జై హిందు" శబ్దమిలకు
హేమప్రసూనాల నేతల్లి యర్పించి
కడుపుచల్లగ నిన్నుఁ గాంచగనెనో

ఏశుభాహముస సృష్టించెనో విధి తాను
భాగ్యాక్షరములు నీఫాలమందు
ఏతపమ్మొనరించి యింత శాశ్వతకీర్తి
సంపాదనము చేయఁ జాలినావొ
భారతప్రజలాచంద్రతారకముగ!
స్మరణఁజేతురు "జైహిందు" శబ్దనుడిగొ
చేయుచున్నారు చేసిరి చేయగలరు
స్వాగతమ్మిదె గొమ్ము సుభాషు వీర! 5

---

## కృ షీ వ లుఁ డు.

ఎండయు వాన సీతసక
యింతయు నార్తిని లెక్కచేయకే
మొండగు సైరణన్మెలగి
మేదిని దున్నుచు దేవు సత్కృపన్
పండినపంటయే పరమ
భాగ్యముగా దలపోతు:వీవు, బ్ర
హ్మాండమునందు నీకుఁ గలరా తుల
యింక కృషీవలోత్తమా? 1

న్యాయివి! దేశబంధుడవు!
నమ్మితివీ ధరణీతలంబునే

వేయివిధంబులన్వేదుక
విశ్వమునందలి మానవాళిలో
హాయిగ, నీదుజీవనమె
యన్నివిధంబుల లెస్సయౌగా జూమీ?
నీయడనే వసించుగద
నిచ్చలు నిస్తుల శాంతిసంపదల్.

వారిజనాభు నగ్రజుడె!
పట్టె హాలమ్ము కుతూహలమ్ముతో
తారకనాథ శేఖరుడె
తత్తడిగాగొని గిత్తనిట్టె, నీ
వారయ వానిరెంటిని స
హాయముగాగొని జీవితమ్ము, స్వే
చ్ఛారతి వెళ్ళబుచ్చెదవు
శాంతమనస్కుడవై కృషీవలా!

వేలకొలందిగా మిగుల
విత్తముగూర్చిన మేటులు న్మహీ
పాలనచేయు రాజులను
పండితులున్నరి తక్కువారు, నీ
కేలి క్రియాఫలమ్మయిన
గింజబలమ్మున నిల్వనేర్చిరో
హాళిక? ప్రాణరక్షకుడ
వన్నను నీవకదయ్య! యెన్నగన్.

ఇంక ననేకభంగులను
 పృథ్వీ గరంబుపకారివైన, నీ
వంకకుచేరి కష్టములు
 బాపెడివారొకరేని లేరు, గో
త్రాంకమునందు రూఢమగు
 నంకురపాళియె సంతుగాగ, ని
శ్శంక సుఖైక జీవనత సాగుదు
 వయ్య కృషీవలోత్తమా! 5

---

## అశ్రుతర్పణము.

హాయిగ తెన్గుతల్లి వన
 మందుఁ జిగిర్చిన గున్నమావిపై
కూయుచునున్న ఆపికపు
 కోమల రాగసుధా స్రవంతిలోఁ
జేయిడ, చిక్కె నా కహహ
 శ్రీయుతుడై యలరారు మేఁటి, నా
రాయణ రాజరత్న మకటా!
 మదభాగ్యతఁ జేరె స్వర్గమున్. 1

పెద్దల పిన్నల స్నేహిణి పీడి
 చెరన్ బడియున్న వేళలో

ముద్దు కుమారి రోగమున
మూల్గుట దా విని, సంచలింప బో
కద్దిర, దీక్షపై మనసు
హత్తగ జేసి స్వదేశ దాస్యమున్
రద్దొనరింప దేహమును
రాల్చిన భక్తుడు! కానరాడుగా.

బాహుబలాన! కౌరవుల
పాండవమధ్యము జేకినట్లు, బల్
సాహస తేజముల్ మెఱయ
జాగుచు నాంగ్లుల దా నెదిర్చి, స
న్నాహముతోడి వ్యూహముల
నంతముగా ఘటియించి యెంచి, మేల్
బాహుజతా ప్రతిష్ఠ నిలు
పంగనె, నాంధ్రకుమారు డద్దిరా!

దండన్ శ్రీయుత పెద్దిరాజు నిలువ
న్దర్పంబు రెట్టింపగా
గాండీవమ్మును దాను గైకొని వచః
కాండమ్ములన్ గుప్పుచో
గుండెల్ జెలడెడి దేశదత్తమదిగ
గ్గోల్ బెట్టగా ద్రోహి యొ
క్కండున్, నిల్వక పారెనంచు విని యా
గాంధే ప్రమోదించెరా!

స్వసుఖమ్ము త్యజియించి, జాతీయతను జాటు
సత్యాగ్రహము గొన్న సాహసికుడు
గాంధి దేవుని జిహ్వ కదలించి సర్దారు
బిరుదంబు గైకొన్న, వీరవరుడు
ఎండ తాకినగందు, మృదు దేహమును, దేశ
మాత కర్పించిన, మహితయశుడు
దీనులన్ బతితులన్ దేర్చి కాచుటయందు
అమర ద్రుమముబోలు, త్యాగమూర్తి!
పుడమి గుర్తించిన సత్యంబు విడువనట్టి
అపర త్రైశంఖుడన నొప్పు నమల యశుడు
దండు వంశామృతాబ్ధి సుధాకరుండు
తప్పిపోయెను గాంధితో చెప్పినారె? 5

మురుపుం దెన్ను సవిత్రికీ గలుగునా
ముత్యాల హారంబులోఁ
దరళంబో యన నొప్పి దిక్కుల య
శోధామం బునన్ బోతె, బా
పురె! నారాయణరాజ! తల్లిని శుగం
భోరాశిలో ముంచి యె
క్కరణిన్ మాకును నింక దల్లికిని క
ల్గంనేర్చు నాశ్వాసముల్. 6

పరదారన్న పదమ్ము లోకమున, నా
చంద్రార్కమున్ నీవు, ను

స్థిరతన్ భాసిలజేసి నాడవు, యశః
శ్రీ యన్న నీదేగదా!
వర నారాయణరాజ మమ్మిచటనే
వర్జించి స్వర్గమ్ములో
దిరుగంబోయితె? యిట్టి చేతకు భవ
ద్ధీ యెట్టు లొప్పెంజుమీ?

భీతి యొకింత లేక మును
భీమబలాఢ్యులు పూర్ణతేజు, లీ
క్ష్మాతలి నెందరెందరొ ప్రశస్త
గుణుల్ మనినారుగాని, దా
భూతిని వీడి దాస్యమున
మూల్గెడి భారతమాత నోము, నీ
భాతిని దేహమిచ్చి కడు
భాసిలగన్న మహాత్ముడుండెనే!

గోదావరీ నదీ! కూలవీధు లయందు
దేశోన్నతిని నాటి దిద్దినావు
అనివార్యమైన సత్యాగ్రహాహావమందు
చిక్కనౌ రుధిరమ్ము జిలికినావు
పంచ భౌతికమైన పంజరంబును పాడు
చెఱసాల కాహుతిఁ జేసినావు
అనుదినంబును, లుప్తమగు నాయువే ఘోర
మృత్యుదేవత పాల వేసినావు

నెలకు నూర్లాది వరహాల, నెటి నొసంగు
వేతనము రోసి నీవు ఒల్ పూతవృత్తి
చల్లగా వెల్గు మాతెన్గు తల్లి కీర్తి
రాణకెక్కించి నావు! నారాయణేంద్ర! 9

---

## కోకిల.

ఆలు దివి కేగినంత! కొన్నాళ్ళు లేడ్చి
మరల పెండ్లాడినట్టి శంకరులనంగ
శైశిరపువేళ, శ్రీ బాసి స్థాణులయ్యు
మరలఁ జిగురించెఁ దరువులామని ఘటింప. 1

వ్రాలె ప్రతీచి కర్కభగ
వానుఁడు మల్లెలఁ జేరి తుమ్మెదల్
కేళిని బాడ జొచ్చె మృదు
గీతము, వీవదొడంగె మెల్ల లే
గాలి పరంపరల్ వనజ
షాండము లెల్లముడుంగ జొచ్చె, న
బ్బాల! రసాల! పల్లవ వి
భామయ సంధ్యమెలంగ సంధ్యతోన్. 2

కుందనపు! తమ్మి పూవుల కొలని కెలన
రమ్యకిసలయ రుచితోడ రాణగాంచి

చెన్నమీఱెడి మా మావిగున్నమీఁద
పాడుచుంటివె? కోకిలా! ప్రణయగీతి!

కానఁగరావు; చిన్కువడు
 కాలము దొట్టి, వసంతమౌలి రాఁ
బూనెడుదాక, నీదు రుతమున్
 వినఁగోరెడి మమ్ము వీడి పో
నౌనె, పరస్థలంబుల కహో!
 పికరాజమ! నీకు, నీ లస
ద్గాన సుధాబ్ధినేరి, మును
 గంగ నొసర్చితి వింతకాలమున్?

ఏ యే నదులన్ గంటివి?
ఏ యే గిరులెక్కఁగంటి? వేయే వనులన్
దీయని ఫలములు మెసవితి?
వాయూ వింతలను దెల్పుమమ్మా పికమా?

మందహాసంబు మోమున చిందులాడ
భవ్యమైనట్టి! శేషాహి! పాన్పుమధ్య
స్ఫురిత రుచిరమైన కమలతో సరసమాడు
తాపసార్చితు గంటె మోదంబుతోడ.

శూలము చేతఁబూని రణ
 శూరతఁ జాటుచు వెండి కొండపై
కాలగళుండు గౌరి సను
 ఖమ్మున నృత్యము సల్పువేళ, త

తేఁకి వనప్రసూన - వితతీ
సురభీకృత వాత పోతముల్
హేలగ! నీకు స్వాగతము
లిచ్చెనటంచుఁ దలంతు కోకిలా! 7

అంబరచుంబియైన రజి
తాద్రిని గాంచిన ధన్యురాల! వా
యంబిక నిన్ను గాంచి కరు
ణారస ముట్టిపడంగ, బల్కెనా
డంబగు నీదు పాట పరి
టంబుగ, దా చెవియొగ్గి విన్నదా?
శంబర వైరిహంతకుడు
స్వాగతమిచ్చెనె? నీకు కోకిలా! 8

అందముచిందులాడ నయ
నాబ్జములన్ వికసింపజేయు, ఆ
నందనకాననంబు గనినావె?
పులోమజనాథు చెంగటన్
చందనసౌరభంపుఁ బన
జాటెడిగానము సల్పినావె, యా
నందముతోడ నమ్మఘవుఁ
డంకముఁజేర్చెనె! నిన్ను కోకిలా! 9

మందమారుత మాకల్ప మహిజపుష్ప
సరససౌరభ మెదజల్లు సభను వేల్పు

నాగవాసము నీచుట్టు మూగిఏమి
పగవహింపఁగలేదుగా! పక్షిరాజ!

పెద్దవాఁడై లేత ముద్దియంబెండ్లాడి!
సుఖియింపుచుండెనా? సురగురుండు
తన వాహనంపు బాంధవుల మాంసము ప్రజల్
దినఁ జూచుచుండెనా! త్రినయనుండు
తన సృష్టిలో నైక్యతత్వంబుఁ గనరామిఁ
గస్సురునించెనా కమలసూతి
భరతఖండము రక్తపాతమ్మునన్దోఁగ
శయనించియుండునా చక్రపాణి
సురుచిరంబైన భారత శోభకెల్ల
కారణంబైన కన్యకా వారమునకు
పాశమనొప్పు వరశుల్క బాధగూర్చి
బాదరాయణుడేమనె పరభృతంబ ?

ఆషాఢంబు ఘటిల్ల మబ్బుగమిలో
వ్యాలీనమా మేనితో
పూషాధ్యంబును, బట్టిపోయితివె? యే
భూమిన్ గనంగోరియో!
దోషంబౌగద నీ చిరాప్తుల మమున్
దూలించి యెందో చనన్
పాషాణాలు గరంగ వెండి మముఁ దే
ర్పన్వచ్చితే పాటలన్.

పూనికమీర దేశములఁ
బూ_ర్తిగజూచిన, మేటివీవహో!
గానవిశారదా! పికమ
కంటివె, యాసురలోక సన్నుతం
బైన, హిమక్షితీంద్రమును!
నభ్భరతావని! వేణిమాలికన్
మానక తెల్పుమందు గల
మంచి విశేషములెల్ల కోకిలా! 13

ఆ శైలరాజమీ! యఖిల భారతధాత్రి
కంగరక్షగ కట్టిన ట్టికోట!
ఆ నగం బే! పూర్వమంబికానాథుని
చారువైవాహి కోత్సవపువేది
ఆ కొండయే మానసౌకాసమూహాల
రమణీయ మహిత స్వారాజ్యసీమ
ఆ గ్రావమే తూర్పుటబ్ధి ఇల్లాలికి
ముద్దుముచ్చటఁ దీర్చు పుట్టినిల్లు
కనగ నమ్మహాద్రి గర్భంపుచలువకే
మంటిపెల్ల పసిడిపంట లొసగు
అమ్మహానగంబు నరయు భాగ్యము నీకు
వరలియున్న ధన్యచరితవీవె. 14

చిదిమినపాలుగారు నును
చెక్కులతోడ, గులాబిపూలబో

ల్పైదవులకెంపుతోడ సుర
    వేశ్యలు బాలకురంగలోచనల్
మృదుల శిలాప్రదేశముల
    మేళమునల్పాడివేళ నేగి, స
మ్మదమున, వారి రాగరస
    మాధురి! గ్రుంగితివమ్మ కోకిలా!

సంగర రంగ మం దసమ
    సాహసమున్వాదజల్లు వైరి, మా
తంగ, వినాశకేసరు లు
    దారులు, నా రసపుత్రు లిండియా
దొంగతురుష్క సంతతులఁ
    దోలిన భూములు కాంచి వచ్చుచో
గంగనుకంటివే పరిబల
    కౌతుకముప్పతిలంగ కోకిలా!

పదియు నెన్మిదిమార్లు బాహాబలప్రౌఢి
    గోరీనడంచిన సార గుణుఁడు
ప్రజలు జేజేవెట్ట ప్రబలుడై మనఢిల్లి
    సింహాసనస్థుడౌ సింహబలుఁడు
ఖాస్మభృత్కులాంబోధి సంఘుంబు వెఱగంద
    జగతినేలిన మహాసాహసికుఁడు
అఖిల భారతఖండ మానందసుధ గ్రోల
    వెలువడంచిన మహావీరవరుఁడు

జడుఁడు నీచుండు నగు జయచంద్రు నెదిరి
ప్రేమజవరాలి సంయుక్త పెండ్లియాడి
వీరస్వర్గంబుగొన్న పృథ్వీప్రభుండు
గరిమనేలిన భూములఁగంటె? పికమ! 17

భంగములేని యీభువన
 భాగమునం దసమాన భావము
త్తుంగ తరంగ మాలయున,
 తోయజ జన్మునిరాణి! కొప్పులో
నంగల రత్నహారమన!
 నల్వురియొప్పెడి వాక్ప్రసంగు, మా
వంగకవిన్ రవీంద్రు గని
 వచ్చితివే పికరాజ ప్రేమతోన్! 18

భారత వారిజాక్షుపలిక
 భాగమునం దెసలారు మేలి, సిం
ధూరపుబొట్టు! ఢిల్లిపురి ?
 త్రొక్కితె, తత్పురికింతదవ్వునన్
శ్రీరమణీనివాసమయి
 సింధునదీ తటవీధినొప్పు కా
శ్మీరమునందు, గంటివటె
 చిత్తమురంజిలజేయు దృశ్యముల్. 19

అది భూలోకపుస్వర్గసీమ, కనినా
 వా! యందునమ్మోదివై

హృదయేశుం గననేగు సింధుసతి, ని
స్నేహమైన లాలించెనా ?
పదిలమ్ముంచును బుజ్జగించెనుగదా !
పక్షీంద్ర యానీమలో
మదిరాపాన తురుష్కవాహినుల దు
ర్మార్గమ్ము చల్లారదా ?

ఏ దివ్యగుణసింధు! విలపుట్ట భారత
తరుణికి గర్భసంతాపమడగె
ఏ మహాత్ముని! నవ్వుమోములోపల విశ్వ
సోదర భావనాశోభ మెఱసె
ఏ పుణ్యపూరుషు! వీక్షించినంతనే
అంటుదోషంబు, దా నడగిపోయె
ఏ సత్యసాగరు! హృదయశైలమునుండి
శాంతిస్రవంతులీ, జగతిఁ బారె
ఎవనినామంబు సర్వదా అవనియందు
భరత భాగ్యవిధాత!నాఁ బ్రణుతికెక్కె-
నట్టిదేవుండు! పిస్తోలు వాతినిఁబడుట
అరసితే పిక కన్నీరువరదఁగట్ట.

ఆతనిభక్తురా లోకతె
అబ్జుని బింబతలాంతరంబునన్
రాతిరియున్ బవల్ విధివి
రామముఁ జెందక యొక్కరాట్నమున్

చేతనఁబట్టి మోదమునఁ
　　　　జేయుచునున్నది పట్టునూలు, త
ద్రీతిని కంటివే పికవరిష్ఠము!
　　　　పున్నమనాఁటి వెన్నెలన్. 22

మొగలాయివంశ, సముద్భాసితుఁడైన షా
　　　　జాను నౌదార్యంపు సాహసంబు
అసమసౌందర్యంపుఁ బస రతీపతి నొంచు
　　　　మహిత ముంటాజి సమాధితలము
ఖండపంచకము నందుండు ప్రాకట మహా
　　　　వైచిత్రు లేడింట ప్రథమకక్ష్య
చంద్రికాంతోపల సౌరులో లీనమౌ
　　　　భరత శిల్పి వికాసప్రబలజ్యోతి
జాజి విరజాజులను బోలు తేజమెసగ
వందలేండ్లేగ ప్రాయంబు వ్రాలకుండ
హాయిలు నొలికించు శ్రీల సముచ్చయంబు
తాజమహాలున గంటె మోదంబుతోడ. 23

నర్మదా గౌతమీ ముఖ్య నదుల మధ్య
అనిశము న్వెల్గుచున్న మా ఆంధ్రమాత!
గర్భమున బుట్టితివి యింక నిర్భయముగ
జగతి వెద చిమ్ము లెమ్మె మా శౌర్యరసము. 24

సప్త బాహులు విచ్చి, జలధి నాథుని గ్రుచ్చి
　　　　కౌగలించి సుఖించు కమలగంధి!

వడమటి గిరులందు ప్రభవించి మా తెన్గు
భూములన్ దిరుగు నంభోవధూటి!
భద్రాద్రి రఘురాము, పాదాబ్జరజమును
మౌళిపై దాల్చు నిర్మల చరిత్ర!
వాశ్యాసనుడు తొల్లి భారతంబును బల్క
భక్తితో వినగన్న పావనాత్మ!
కలుషములు వాయ నెల్ల పుష్కరములందు
మనుజసంతతి పూజింప దనరు నట్టి
పావన విశాలగౌతమీ భద్రకీర్తి
అరసితే కోకిలా పాప మణగిపోవ.

ధీరుడై! చిర యశస్స్ఫారుడై! అసమాన
శూరుడై! శతకోటి! దారుడగుచు
దాతయై! భవననిర్మాతయై! భూనతీ
నేతయై! వరధనోపేతు డగుచు
మదనుడై! రజనీశ వదనుడై! భాస్వర
ద్రదనుడై! సుగుణైక సదనుడగుచు
పూతుడై సత్కళా ప్రీతుడై! భువనవి
ఖ్యాతుడై! దుర్దాంత కేతుఁడగుచు
తెనుగు పొలమున యెనలేని ఘనత కెక్క
ఆంధ్ర భోజుండనగ, ఖ్యాతినందినట్టి
కృష్ణరాయల ఘన సభా గృహాతలమ్ము
విజయనగరాన గంటివే? పికవరేణ్య!

అల పలనాటి ఘోరరణ
    మందలి వీరమదేభయూధమున్!
గలచిన, బాలచంద్రముల
    కైదువు వాడి యడంగెనేమి, త
త్తలముల బాలచంద్ర భట
    తల్లజు శౌర్యమయాగ్ని నేటికిన్
జిలుకుచు నుండకున్నె పెను
    జిహ్వాలు విచ్చుడి భీకరార్చులన్. 27

పోటరి కాకతీయ కుల
    భూషుడు రుద్రనముండు వీరుల
న్నేటి, ప్రతాపరుద్ర ధర
    ణీతల నాధుడు! మ్లేచ్ఛ తుగ్లకున్
గీటడగించినట్టి, నృప
    కేసరి తద్విభుకంటి కెంపు, మ్లే
చ్ఛాటవిపాలి దావమయి
    యారక వెల్గుట గంటె కోకిలా! 28

పరికించితే! కొండపల్లి భూముల నాటు
    వడ్డ వేమకవీంద్రు భవ్యకీర్తి!
కనుగొంటివే! పూత గౌతమీతటి నేడు
    విదితమౌ చాళుక్య విభులకీవి
వీక్షించితే! కొండవీటి రాజులు కూలి
    పడినట్టి కత్తుల బావిలోతు

దరిశించితే! మాధవవర్మ కథఁజాట
జాలు నా కనకదుర్గాలయంబు
భువన సన్నుత శిల్ప నైపుణ్యమునకు
నిలయమై పల్లవాన్వయ నృపవరేణ్య
పాలితంబగు నమ్మహా బలిపురంపు
వీధులం జూచి వచ్చితే పికవరేణ్య?

తలచుకొలది గుండె తల్లడిల్ల దొడంగె
ఆంధ్ర! సన్మహామున కంతు గలదె
మరువదరమె నీదు, చిరతర స్నేహంబు
ముచ్చటింతు రేపు వచ్చి పికమ!

---

## కూలి.

కాలమహా వాహినిలో
దూలుచు దరిఁజేరలేక తోరపు దాల్మిన్
చాల నుదారతమును నినుఁ
బోలుదురే, ఎవ్వరైన భూస్థలి కూలీ?

తూరుపుకొండఁ గెంపు జిగిఁ
దోపగ, మోకళులార్చు చుండగా
నీరజవైర! గర్భ బిల
నిర్గతమై యళిపిందు వెల్వాలం

బారెడు వేళ, మేలుకొని
భారత పుత్రిక, నీవు కడుపు క
ష్టాకరితిచేత నేగెదవు
కూలికి! జాలియగున్ నినుంగనన్. 2

కట్టగ గుడ్డలేక కడ
గండ్లకు లోనయికుందు గాంచు, నీ
దిట్టపుగుండెలో నుబికి
తేలెడి భావములెన్నియో గదా!
పొట్టకు బట్టకింత సరి
పోవని కూలిని జీవిత మ్మెటో
గుట్టుగ వెళ్ళబుచ్చెదవు
కూలి? భవత్శ్రమ కెవ్వడయ్యెడున్. 3

వేదండమును బట్టి, మోది కూల్పగ జాలు
బలము నమ్రతయును, బయలు పడగ
ఎండకొండయు నాక యెట్టి వేళలఁ గూడ
కాయంబు శ్రమకు నగ్గమ్ముకాగ
ధారమై నెమ్మేన, గారెడు చెమటలో
శాంతస్వభావంబు స్పష్టపడగ
ఉదయ మందినదాది, పదిరెండు గంటలు
తనువు దాపక నెల్ల పనులొనర్చి
ప్రతి దినంబిట్లు శక్తి నర్పణము జేసి
కూలి బత్తెంబుతో శేయి కొంపజేరి

పొట్టనిండని కూలికే పొంగి పోయి
యుపవసింపుచు, ముదమందు 'యోగివోయి!'

---

## పల్లెటూరు.

చక్కని యీసృష్టి! జవరాలి! యొడినుండి
ఆరు ఋతువుల యందు నాడుబాల!
కల్పించి సర్వదా, సృష్టి కాధారమై
యలరారు కృషిక దేవాలయంబు!
ఆకటన్ గుమిలియు నలసత్వమును చాటు
ననదయా కూలి యోగాశ్రమంబు
సువిధేయతో పచ్చ సుస్థిరంబైన పా
తివ్రత్యవల్లి వర్ధిల్లు వనము
వివిధ పశుసంతతుల పెంపు వెలయుతావు
జగతిఁ బోషించు సకలసస్యముల తావు
భవ్య ఫలపుష్పపక్షి సంపదల ప్రోవు
పల్లెయే! భారతాంబకు పాడి యావు.

ప్రాకిన మల్లె ద్రాక్షలత
పందిరిక్రిందను ముచ్చటింపుచున్
కోకిల గొంతు గుట్టెరిగి
కోమల గాత్రము లెత్తి పాడుచున్

నా క విభూతినైన గణ
నంబొనరింపక హృష్ట చిత్తులై
రాకల పోకలన్ మనసు
రంజిల జేతురు పల్లెబాలకుల్. 2

శ్రవణ సుభగమ్ముగా, నూపురములు మ్రోయ
అంబుపూరిత ఘటము లొయ్యన వహించి
వన్నెలొలికించు కాపుల కన్నెలెపుడు
నీరు గొని పోదురొయ్యారమూరి మెఱయ. 3

గాలికి తూగుచున్ నయన
కౌతుకమొప్ప జెలంగు పూలపై
వ్రాలెడి, తేంట్ల రాగమయ
రావములున్ విధి సృష్టి చాతురీ
లీలలు మెచ్చుచున్ ప్రకృతి
లీనమనోజ్ఞతలన్ లిఖింపుచున్
కాలముపుచ్చు సత్కవుల
గంటము లెప్పుడు పల్లెటూరులన్. 4

కదలించి నవసుమకాండమ్ములన్ బట్టి
శ్వసనుండు వ్యాహాళి సలుపువేళ
సరసిజాప్తు నిం బొంద మురియు సంధ్యా కాంత
పట్టుమోదుగచీరఁ గట్టువేళ
తమ్మి తేనెలఁగ్రోలు తుమ్మెద చోరుల
వంచింప రేకులు పొంచువేళ

దుగ్ధముల్ చేపొంది, తొణుకాడ వనినుండి
పశులింటిమొగములై పఱచువేళ
కోకనదములు వికసించి కులుకువేళ
శకున జాలమ్ము గూండ్లకు చనెడువేళ
కన్నదోయికి పండువు కలుగఁ జేయు
పల్లెసొగసును వర్ణింప వశమె యెందు.

---

## బాపూజీ పూజాపుష్పములు.

శ్రీరాసి కాకరం బయి
భూరి యశఃజ్యోత్స్న లెసగ! పాలుపారెడి, యీ
భారత ధారుణి! బుట్టిన
నారాయణదేవ! బ్రోవు నమ్మితి గాంధీ!

కొందరు నిను హరియందురు
కొందరు బుద్ధుండు మఱి భగుండందురు, క్రీ
స్తుందురు కొందరు! మఱి, దా
మెందరు యేమన్న దైవమీవే! గాంధీ.

పుట్టితివి పోరుబందరు
పట్టణమున భరత దాస్యబంధము విడిపో
నెట్టితివి, యాంగ్లప్రముఖుల
కట్టితివ మ్ముతుకగుడ్డ ఘనముగ గాంధీ!

మాతచిరునాఁటి బోధలు
గీతగ పాటించి అసమకృషిమీఱ నహిం
సాతత్వమెఱిగి నడచిన
పూతాత్మా! కృపను మమ్ముఁబ్రోవుము గాంధీ! 4

చిలుకలు కోరును తీయని
ఫలములు, జలజములు గోరు భాస్కరురాకన్
కలహంసగోరు బిసమును
తలతుము నీదయను మేము తద్గతిగాంధీ! 5

కోటలు పేటలుగూల్చెడి
ఆటంబాంబుల మదంబు లడచి, నుతంబౌ
రాటంపు రమ్యరుచితో
నాటితివి త్రివర్ణ కేతనమ్మును గాంధీ! 6

కోటుల నార్జించిన యా
మేటుల లాంకాషైరుమిల్లు మిటమిటలుడుగన్
నీటగు ఖద్దరుబట్టలు
పాటిలగాఁ జేసినట్టి బ్రహ్మవు గాంధీ! 7

స్రష్టమె! యీజగమెల్లను
సృష్టించి, యెరుంగడయ్యె చెల్మిఘటింపన్
స్పష్టముగ నహింసామృత
వృష్టిని గురియించి వెలయు విధివో గాంధీ! 8

కడుఘోరదాస్యవాహిని
సుడులంబడి తెలివులేక స్రుక్కెడి యీ మా
కడగండ్లుబాప భూస్థలి
బొడమిన దేవుడవు మమ్ముబ్రోవుము గాంధీ! 9

దరిజేర జనులు రోసెడి
హరిజనసోదరుల దైన్యమడగించిన, త్వ
త్కరుణామృతమయ హృదయము
వరదా స్మరణింతు! విబుధవందిత! గాంధీ! 10

పర్వ మపర్వం బెరుగక
గర్వించి చరించు ఘోర కఠినాత్ములకున్
సర్వమతంబులు జనులకు
నిర్వాణకరమ్ములనుచు నేర్పితి! గాంధీ! 11

దేహమనిత్యంబని ధన
మోహము విడనాడి దీనపోషణ కొఱకై
గేహంబురోసి, హింసను
సాహసికత నడచినట్టి చతురుడ గాంధీ! 12

సిరితో వెలిగెడు లండను
పురి, శ్వేతముఖులు బెగడగం బోరిం దిరుగుచు శ్రీ
గురిసెడి, రాటపుమహిమను
గరముం బ్రకటించినట్టి ఘనుడవు గాంధీ! 13

ఉరికంబములను శిరములఁ
దరిగెడి యీ దమననీతి దావాగ్నులలో
పరహితము పొందెకాగిన
కరుణామయ మానసుడవు గాదే గాంధీ! 14

గిరిదరి కాననసీమల
తిరుగుచు విప్లవము రేపు ధీరులలో, నె
వ్వరు, హత్యారుధిరనదుల
నరికట్టిరె? నీవు దక్క నమలుడ గాంధీ! 15

హరివై నీవా జవహరు
నరు జేసి త్రివర్ణ కేతనముగల తేరుం
బిరబిరతోలి స్వారాజ్య
స్థిరలక్ష్మిని గైవసంబు చేసితి గాంధీ! 16

కరుణ ఎరుంగని ఘాతుక
నరదనుజుల ప్రేమపూర్ణ నవ్యామృతమున్
గురిపించు భవన్ముఖము
న్దరిసించి సునీతులైరి తథ్యము గాంధీ! 17

హిందూ ముస్లిము క్రైస్తవు
లందరు సోదరులటంచు, నవిరళశాంతిం
బొందుపరుప భరతావని
యందుద్భవ మందినట్టి హరివో గాంధీ! 18

వదలని త్రిప్పుల నినదమె
మెదలెడి టాంకృతిగ రాట్నమే చాపముగాఁ
గదు రమ్ముగా నహింసా
కదనము సాగించి జయము కంటివి గాంధీ! 19

పరు దుర్దశగని గుండెలు
కరుగగ దురపిల్లి వారి కడగం డ్లుడుపన్
శిరమేని తరిగి యీయగ
వెరువని ధీరుడవు లోకవినుతా గాంధీ! 20

నరహరి! నగధర! మాధవ!
గిరిసుతపతి వినుత! శౌరి! గీర్వాణనుతా!
వరభక్తపోష! దానవ
హర! దీనుడ గావుమయ్య అనిశము గాంధీ! 21

కురురాజు పెట్టునిడుమల
దెరలిచి పాండవులకెల్లఁ దేజస్స్ఫూర్తిన్
గరువమును గూర్ప నేర్చిన
మురహారుడవు నరుడవగుదె? పూజ్యుడ గాంధీ! 22

మందుకొనిపోవు బోయరు
భండనమున, క్షతులగు భటపాళికి రక్షన్
మెండుగసల్పిన నీ నెఱి
గుండెబలము మరువ కెపుడు గొలుతుము గాంధీ! 23

పెట్టిరి నిను చెరసాలను
కొట్టిరి లాఠీల దుండగులు మఱి, గా నీ
పట్టాఁకయించుక వీడక
పుట్టించితిగా స్వరాజ్యభూతిని గాంధీ! 24

కలహంస జలములను విడి
బలుపాలను గొనెడిరీతి బలుసీమలలోఁ
బలుమతములలో దొసఁ
గుల విడి కల సారమేఱికొంటివి గాంధీ! 25

నలుబదికోటుల సంతతి
గలిగిన ముదమేది భరతకాంతకు, నీవే
వెలువడకుండిన, నుడుశత
ములున్న శశిలేక జలధిపొంగునె గాంధీ! 26

పెక్కేండ్లు దాస్యవనధిం
జిక్కి మరుగు భరతవర్షసీమంతిని కే
దిక్కును లేని తరుణమున
దిక్కయిపుట్టిన రమాపతివిగద! గాంధీ! 27

పరికింపరు తమదొసగుల
నిరసింతురు పరుల మిగుల నిజమారయ కే
గురువెందపూస తన నలు
పెరుగని చందమున చెప్పనేమిక గాంధీ! 28

అరువదియేండ్లు శ్రమించిన
వరకాంగ్రెసుతోడ; లీగువర్గము తనుకున్
సరిభాగమడిగి యెదురగ
తెరచితివాపగను నీమతిప్రభ గాంధీ! 29

వృత్తులు సమసిన దేశపు
సత్తువడయ్యంగ పరమ శాంతిసత్త్వల్
మొత్తముగపార మానవ
చిత్తముల ముదమ్ము గలుగజేసితి గాంధీ! 30

ఎందరో వేల్పులు జన్మం
బందిరి భారమ్ము నడప నవనిని మును, నీ
చందమ్మున నహింసాగ్ని న
మంద కృపామృతము గురిసి మాపిరె? గాంధీ! 31

హెచ్చుగ కూర్మి నటింపుచుఁ
జిచ్చిడి గృహసీమలందు చెండాడిన, యా
మ్లేచ్ఛుల యూరపువాసుల
మచ్చిక వంచించినట్టి మహితుడ గాంధీ! 32

నెలతాల్పు వృషభరాజము
బలరాముని హాలము నమితభక్తి వెలుంగన్
గొలిచెడి నిరుపేద కృషీ
వలులం గరుణించినట్టి భవహర గాంధీ! 33

చంపారణ భూములలో
పెంపొందెడి దొరలపీడ వెడలిచి మము, ర
క్షింపుమని వేడు, కృషికుల
కంపంబులు బాపితీవె! ఘనముగ గాంధీ! 34

తలచిన జాలును నీపద
జలజమ్ములు స్వాంతసీమ జడుడేని మహా
కలుషితములు బాసి మెరయుఁ
బులుగడిగిన ముత్తియంపు పోలుపున గాంధీ! 35

గీత ఖురాన్ బైబిలులకు
జోతలు సమరీతి నలిపి చూపిన బేస్మెన్
ఘాతక నరదానవులను
చేతమ్ములు సిగ్గువడగఁ జేసితి గాంధీ! 36

నీదు భర్తృరాలు, నెలబాలలో నూలు
తీయుచున్నదయ్యె, దీక్షతోడ
బడుగు పేదరాలి ప్రతినమేమోగాని
కడు విచిత్రమరయ గాంధిదేవ! 37

---

# అరుణోదయము.

సంచరించి రాత్రి శశధరబింబంబు
పశ్చిమాద్రిదెసకు పఱుగువారె
తెల్లవారుటదిగొ తెలసి దివాంధముల్
నిష్కుహాములయందు నెలవుకొనియె. 1

చీకటు లంతకంతకును
చిందరవందర లందజొచ్చె, నా
లీక హితాగమంబెఱిగి
క్లేశముజెందె కువాలజాలముల్
కోకనదంబుపోల్కి మఱిఁ
గుంకుమమట్టులఁ గింశుకంబటుల్
ప్రాకట రాగభారమున
భాసిలె నాకతలమ్ము సర్వమున్. 2

అండజజాతులెల్ల, దెస
లందు దమిస్రను భూరుహాంబులం
దుండి, ప్రభాతవాటగని
యుత్సవమొప్పెడి సందడింపుతో
మెండుగ గూయుచున్ మొగసె
మేతలకై సురవర్త్మకంత, మా

త్రండఁని! మండల మ్మొదితమై
కనుపట్టె సురేంద్రు దిక్కునన్. 3

అలి కులములు గీతంబులు
పలుకుచు నల సారసములపై జేరియటన్
గల తేఁటియలంగొని, య
వ్వలజని వేరొక సుమంబుపై వ్రాలెఁ దమిన్. 4

ఆగక రేబవళ్ళు వన
జాప్త శశాంకులు! తేర్చి యిట్టున
ట్లూగెడు కాలచక్రమున
సూతములై నడిపింతురందులో
బాగులు నోగులున్ గనుచు
వర్తిలుటల్ ఘటియిల్లుమాయురే!
దాగుఁడుమూతలట్టివిగదా!
భగవంతులయుం జరిత్రముల్. 5

---

## మా ల.

పూల వనికేగి విరజాజి పూలుతెచ్చి
లీలఁ దళుకొత్తగూర్చిన మాలగాదె
మేలి సౌరభమెదజల్లు మాలకన్న
మాల నిజమైన ముత్యాలమాల నిజము. 1

మాల ధరింపడే భవుడు!
మాళి నిశాపతి యుండ పూర్వ మా
శ్రీలలనాంశజాతయగు
సీత వరింపదె తొల్లి రాము పూ
మాలనువైచియే! పసిడి
మాల పసూనవుమాలలందు, ఓ
మాల! కృతార్థవీవు జన
మండలికిన్ బ్రియమ్మై వెలుంగుమీ. 2

కూలిన నీదు ప్రాజ్మహిమ
కోటగకట్టి హిరణ్మయంబుగా
తేలిచె గాంధిదేవుడదె
తీయని ఆ చిగురాకుమావిపై
కేళిచరించు నప్పికము
కీర్తనఁజేయును నిన్నతంబు, నో
మాల! విషాదమున్దెగడి
మానవజాతి నుతుల్ గ్రహింపుమా. 3

కాలమహోదధిన్ దెఱవు
గానక, తీరము చేరలేని, నీ
బేలతనంబుఁ జూచి జన
బృందము నిన్నరనేసి జూడగా
జాలివహించి గాంధి, తన
జాతి నమత్వ మహాప్రవహ్నిలో

గాలిచె నంటుదోషమును
గాంచుమ పెంపును మాల నీవికన్. 4

వేఁ్రలెడు నంటుదోషమను
పెన్దెరనే ద్త్రెఁ జించివై చి, యే
జాలము మాని మానవుల
సంతతితో సమరేఖ నిల్చి, జే
జేలనుఁ గొట్టి నవ్యయుగ
సృష్టిని నీ వొక పాత్ర ధారివై
మేలుగ భారతాంబిక, క
మేయ సపర్యలు సంఘటింపు మా. 5

చాలగ నిరసింపుచు, నెగ
తాళిని గావించు నరుల తప్పుల వనధిన్
గేళి యొనర్పగ, నిక మన
కేలా! శ్రీ గాంధిదేవ! కృపగల మాలా! 6

---

ఢి ల్లీ పు రి.

కోదమసింగము లట్లు! కుంతీ కుమారులు
ధరణి భారమడంప పెరుగునాఁడు
అరసి కన్నీటితో సురనదీ! నూనుండు
పెంచి కూరిమిని లాలించు నాఁడు

మర్మమెఱుగని కృపా మహితుడౌ ద్రోణుండు
పొఱలేక విద్యలు గఱపు నాఁడు
కౌరవుల్ గడు గూర్చు ఘోరాపదల నుండి
వనజనాభుండు గాపాడు నాఁడు
తనువు పులకింప లోచన ద్వయమునుండి
సమ్మదాశ్రులు రాల్చి నిశ్చలత మీఱ
ధన్యతం గన్న నీ పురాతన మహస్సు!
చూపగదవమ్మ మాకు "ఢిల్లీపురమ్మ!" 1

పవన నందను గదాప్రహారణమ్మున, దుష్ట
దుర్యోధనుండడసిన్ దూలునాఁడు
కేతనంబున గ్రాలు కోతిమూకల ఱేఁడు
జయము పార్థుని దంచు చాటు నాఁడు
స్యందనా రూఢులై సంగరమ్మున కవల్
జెల రేగి శత్రులం జెండు నాఁడు
పగఱ గుండెలు జీల్చు పార్థమార్వీ ధ్వనిన్
దిగ్దంతి సంతతుల్ బెదరు నాఁడు
జలధి వేల్లితధారుణీ వలయు మెల్ల
శ్రీలు గురియంగ ధర్మజుఁడేలు నాఁడు
ధన్యతం గన్న నీ పురాతన మహస్సు!
జూపగదవమ్మ మాకు "ఢిల్లీపురమ్మ" 2

## కాటకము.

రాహుకేతులు చేరరాని భీష్మత మీఱ
సరసిజాప్తుడు మింట సంచరించె
పొగరెక్కి తన జింక జగతిలో తిరుగాడ
విచ్చలవిడి గాలి వీవ దొడగె
సన్యాసి యగువాఁడు సంసారమును బోలె
తరువులు పర్ణసంతతిని రాల్చె
ఇంద్రుండు మేఘాల నెందేని బంధింప
కార్చిచ్చు లడవులఁ గాల్పదొడగె
ఎండమావు లెచ్చె నెల్ల భూతలమందు
శాద్వలమ్ములెండె జగతి మండె
దినము హెచ్చసాగె మను మార్గములు వీగె
క్ష్మాతలమున మునిగె కాటకమ్ము. 1

కన్నుల పండువౌచు కన
కంబును పండెడి క్షేత్రరాజముల్
మన్నయిపోయె ధేనువుల
మందలు ద్రావ జలంబులేమి నా
పన్నత జెందె సర్వజన
వర్గము శాంతిక పౌష్టిక క్రియల్

వున్నమ దోట్టి పర్వముల
పూర్తిగ సల్పియుఁ గానరంబులన్. 2

చిన్ని కూనలు మాతలఁ జేరి వగవ
కన్న తల్లుల గుండెలు కరగిపోవ
పొరలు గొని వచ్చు కన్నీరు వరద గట్ట
కటికి పేదలు దుఃఖాగ్ని కగ్గమైరి. 3

అన్నములేమిచేఁ దనయు
లాకటి చిచ్చున తల్లి జేరి, 'యే
మన్న తినంగ బెట్టుమని
యందరు యేడ్వ కృపారసంబుతో
కన్నుల నీరుపెట్టి కడ
గండ్లకు నంతములేదె ఈశ్వరా
యన్నను, నాలకింపడు ద
యామయుడెచ్చటఁ డాగియుండెనో. 4

త్రావ జలంబులేమి కడు
ధైర్యముడయ్యగ నెందుబోయినన్
ద్రోవల నింగికిన్ భువికిఁ
గోరింబాగ లెంతయు గ్రమ్మ భూప్రజల్
జావగనుంటిమీశ యని
సారెకు గుయ్యిడి వేడి యేడ్వగా

గ్రావములెన్నియో కరగు
　　రాలదు చినొ్కకటేని భూస్థలిన్. 5

పొట్టకింతలేక కట్టగుడ్డయులేక
పల్లెపట్టణాల బడుగులెల్ల
యేడ్వసాగిరయ్యొ యేమాదురకక్కటా!
కన్నదైవమెఱిగి మిన్నకున్న. 6

అండకు చేరదీయుచు ద
　　యారసమున్ గురియించువారు భూ
మండలి నెందులేరధిప
　　మంగళధామ, దయాసముద్ర మా
ర్తాండనిశేశ్వ రాక్ష మద
　　రాక్షస, హాంత ఖగేంద్రవాహ యీ
మండెడి క్షుత్పిపాసలను
　　గ్రుగ్గెడి దీనులఁ గావవేమిరా! 7

వాకొన శక్యమే విబుధ
　　వర్యులకైనను, యీవిపత్తు హా!
చీకెను మాశరీరములు
　　శ్రీరమణీ హృదయేశ! యీయదే
వేకువయయ్యె తూర్పుదెస
　　వెల్గదొడంగె ననూరుశోభ మా
గోకులు దుర్దశన్ దెలిసి
　　కూయదొడంగెను పక్షిజాలముల్. 8

ఇనుడుదయించె తూర్పునగ
మెంతయు కుంకుమకాంతినూనె, నా
దినకరుగాంచి యల్లదిగొ
తెల్లమొగంబున బారె సోముఁడో
యనఘ,! పరాత్పరా! వరద!
అబ్జభవామరసన్నుతాత్మ! యీ
దిన మెటులేగునో గదర
దేవర! దుర్దశబాపి కావరా! 9

---

## ఆశీర్వచనము.

శ్రీరమణీమనోహరుడు
చిత్తజుగన్న త్రిలోకనాథుడా
నారదగానలోలుపుడ
నారతకీర్తన సక్తభక్త బృం
దారక పాలనోత్సుకుడు
దారుడు, భూరికృపాసముద్రుడీ
కూరిమి ముద్దుదంపతుల
కున్ ఘటియించు జిరాయురున్నతుల్. 1

తెల్లని రేయి నయ్యమున
తీరమునన్ బాలుపా వనస్థలిన్

చల్లని మారుతమ్మొసగు
సైకత సీమల వేణువూదు నా
నల్లని వెన్నదొంగ కరు
ణారస ముట్టిపడంగ బేర్మితో
పిల్లల నీవధూవరుల
ప్రేమరసోదధిఁ దేల్చిగాచుతన్. 2

శాంతి! అహింస! సత్యమను
శస్త్రవరమ్ముల రక్తపాన సం
భ్రాంతిని, దుష్క్రియోచ్చయ ప
రాయణమైన పరప్రభుత్వ, దు
ర్దాంత కఠోర రాక్షసిని
రాల్చి వెలింగిన గాంధిదేవు! డ
శ్రాంతము నివ్వధూవరుల
స్వాంతమునన్ విహరించి గావుతన్. 3

సురలనుబోలు సౌమ్యగుణ
శోభితులన్! మహనీయశౌర్యులన్
ధరణితలాధినేతల! ను
దారుల పెక్కుర గాంచినట్టి భా
సురనిజకీర్తి! నిప్పటికి
శోభిలు నాశ్రితకల్పవల్లి, మా
భరతసవిత్రి! నిత్యము శు
భంబులు గూ

## శిల్పి - జాతిప్రతిమ.

ఊరివెలుపలనున్న మా కో
నేరుగట్టున పల్లవించిన
బూరుగూ భూజంబుక్రిందను
పొదలు పెరిగినవి. 1

తొలకరించెను ధారుణీసతి
జలకమాడెను అడవిమల్లెలు
పొలుపుగా వికసించి కనులకు
భుక్తినిడుచుండెన్. 2

చల్లగా మహిపీచు పవనుని
చయిదముల కే ప్రమదమందుచు
మెల్లగా నడుగిడుచు చనచన
మేదినీస్థలిపై. 3

డాలుఖడ్గముఁ బూని తన దొక
కాలుముందిడి యాహవమ్మున
తూలిపడునొక వీరప్రతిమకు
దోసిలొగ్గితటన్. 4

నల్లనగు నా ప్రతిమ గళమున
మల్లెపూవుల తీగయొక్కటి

తెల్లగా వికసించి యొక నవ
తేజమెసగించెన్. 5

ఆర్యసంతతినాఁటి శిల్పా
చార్యుఁడెవఁడో రాతి బొమ్మకు
ధైర్యసాహసములను బోసి
ధన్యుఁడయ్యెనురా! 6

మొలచెనెన్నో గుడులు యీతని
యులిముఖంబున నాంధ్రభోజుని
కొలువులో మన తెనుఁగుతల్లీ
కులుకు వేళలను. 7

కొండకడుపున నిదురజెందెడి
బండవాళ్ళను మేలుకొలిపీ
గుండెబలమునుఁ జూపి ధరణీ
మండలంబును వీడెరా! 8

ప్రతిదినంబును హైందవులు నీ
ప్రతిమలను బూజింపుచుందురు
క్షితతలేశులుసైతఁ మదిగని
శిరమువంతురురా! 9

పూజితంబై యలరు నాముం
తాజి ఖద్యములంను నీపస

మోజుగా విరజిమ్ముచున్నది
మూడు లోకములన్ 10

కలముఁబట్టిన కవిసమానుఁడ
విలను నీవొక్కరుడవోయీ!
చెలువమును గడుజిమ్ము యులి, నీ
చేతనుండుటచే. 11

ధన్యుడవురా! శిల్పి త్రిజగ
న్మాన్యుడవురా! ఱాళ్ళలో సౌ
జన్యమును తోణికించు నీకివె
స్వాగతంబులురా! 12



రాయల ముద్రణాలయము, తెనాలి. ఫిబ్రవరి-1950.